# భక్త కబీర్

రచన:

డాక్టర్ రావూరి భరద్వాజ

ప్రధానసంపాదకుడు:

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ:

శ్రీ ఎస్. లక్ష్మీనారాయణ, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1985

T. T. D. Religious Publications Series No- 224

SRĪNIVĀSA BĀLABHĀRATI - 39
( Children Series )

BHAKTA KABIR
by Dr. Ravuri Bharadwaja

*Chief - Editor :*
Dr. S. B. Raghunadhacharya

First edition: 1985
Copies : 10, 000
Price : 1—00

*Published by :*
Sri S. Lakshminarayana, I.A.S.
EXECUTIVE OFFICER,
Tirumala Tirupati D.
Tirupati.

Art: CHĀYA

Printed at :
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# స్వాగతం!!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయినీ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పేనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక-ధార్మికాదర్శాలకు పేరు పడ్డది మన భరతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మాధవాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖసంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటి ప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేనుభారతీయుణ్ణి' 'ఇది తరతరాలనుంచి వస్తున్న నా సంప్రదాయం' 'ఇది నాకర్తవ్యం' అని ప్రతిబాలుడు, బాలిక ఈ దేశ సేవకు తనను అంకితం చేసుకొంటారు.

నిజానికి ఈ దేశంలో ఎందరో మహానుభావులు మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని

సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మన దాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మనవెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది. ఆ పుణ్యపురుషులు మహాసాధ్వులు ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్ళను అర్థంచేసుకోవడం, వాళ్ళ చరిత్ర మననంచేసుకోడం వారి ఆదర్శాలు స్మరించడంకూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను విరజిమ్ము తుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందతో మహానుభావుల్ని మీ ముందుంచుతోంది, ఇక మీదే ఆలస్యం.

బాలలూ! రండి! రండి!

నిండుమనస్సుతో మీ కిదే మా స్వాగతం!

క్రోధన, ఏరువాక
3–6–1985

ఎస్. బి. రఘునాథాచార్య
ప్రధానసంపాదకుడు.

# ముందుమాట

అల్లారు ముద్దుగా పెరిగే అందాల బాలల అద్దాల్లాంటి మనసులు ఎంతో నిర్మలమైనవి. వాటిముందు మనమెలాంటి సంస్కారాలను నిలిపితే అవే ప్రతిబింబిస్తాయి. చెరగని ముద్రవేసిన ఆ సంస్కారాలను వాళ్ళు భద్రంగా జీవితమంతా దాచుకుంటారు. భావిభారత పౌరులైన వారెంత సంస్కారంతో పెరిగితే, ఈ దేశాన్ని అంత చక్కగా తీర్చిదిద్దగలుగుతారు. కనుక మన సంస్కృతిలోని గొప్ప దనాన్ని, భారతజాతికి పెట్టని అలంకారాలై ప్రపంచాన్ని అలరించే మంచిగుణాలను వాళ్ళకు ఉగ్గుపాలతో నూరిపోయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎన్ని విద్యలు నేర్చినా, ఎన్నెన్ని రంగాల్లో లబ్ధ ప్రతిష్ఠులైనా ప్రజల్లో ఈ సంస్కారం కొఱవడితే ప్రమాణాలు పడిపోయి జాతి అంధకారబంధురమౌతుంది. అందుకే మనదేశంలో పుట్టి, ఏదో ఒక ఆదర్శానికి అంకితమై మనకు గర్వకారణమైన మహాపురుషులు, మహాపతివ్రతల కథలు చిన్నారిపాపలకు అందు బాటులో ఉండేటట్లు చేయడానికే ఈ ప్రయత్నం. ప్రాచీన భారతీయుల మహత్తరాదర్శాలను పరోక్షంగా తెలియజేయడమే ఇందులోని ముఖ్యోద్దేశ్యం.

తిరుమల తిరుపతి దేవస్థానం ఈ సంకల్పంతోనే 'శ్రీనివాస బాలభారతి' అనే పుస్తకమాలను చిన్నపిల్లలకోసం ప్రకటిస్తున్నది. 'మీరు బాలభారతి అన్నా మాకు, మా కుటుంబంలో అందరికీ ఉపయోగిస్తున్న దంటున్నారు చాలామంది పెద్దలు. తాము చదివి తమపిల్లలచేత చదివిస్తే కొంతకు కొంత మా ఆశయం నెరవేరుతుంది.

ఈ బాలసాహిత్యాన్ని చక్కగా తీర్చి దిద్ది, మంచి రచనలను తయారుచేయించి, అందరికీ అందుబాటులో ఉండేటట్లు సంపాదించిన డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య (కో-ఆర్డినేటర్ పబ్లికేషన్స్, టి. టి. డి.) గారికి నా అభినందనలు. ఈ ప్రణాళికకు సహకరిస్తున్న రచయితలకు, కళాకారులకు నా ధన్యవాదాలు.

క్రోధన-ఏరువాక
3—6—1985

ఎస్. లక్ష్మీనారాయణ, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

మతాలపైన మతీంత ఆగ్రహంకాదు మనం చూపవలసింది: అదుపు ఆజ్ఞలేని మన మతులపైన నిగ్రహం. మతాలన్నీ మంచినే బోధిస్తాయి. కానీ మానవుడే స్వార్థంతో మతికి తోచినట్లు చేస్తూ మతాలపై మచ్చలు వేస్తున్నాడు. మన చుట్టూ కనబడేది మతి దౌర్బల్యమే గాని మత దౌర్బల్యం కాదు. "నీవు హిందు' వని కొందరు: 'నీవు ముసల్మాను'వని ఇంకొందరు మతాతీతుడైన ఒక మంచి మనిషిని తాళ్ళతో కట్టి బాధించి, భాగీరథిలో పడవేసారు. ఏమి జరిగింది? ఆ మహనీయుని మహిమవల్ల కట్లు తెగిపోయి గంగా భవాని ఒళ్లో అల్లారు ముద్దుగా తేలియాడాడు. చిరు నవ్వులు చిందించాడు. విస్తుపోయారు ప్రజలు ఈ విచిత్రోదంతాన్ని చూస్తూ. ఆ మహానుభావుడెవరో తెలుసా? లోక భీరువుకాని భక్త కబీర్.

ఆయన మతసామరస్యం, మానవుల్లో మాధవుణ్ణి దర్శించ గలిగిన తాత్త్వికదృష్టి మనకాదర్శం కావాలి. ఇక చదవండి!

—ప్రధానసంపాదకుడు.

# భక్త కబీర్

ఎందుకీ ఆచారాలు ?

మనం సంఘజీవులం. సంఘాన్ని విడిచి జీవించలేం. ఈ సంఘంలో రకరకాల అంతస్తులవాళ్ళు, రకరకాల మనస్తత్వాల వాళ్ళు ఉండడం సహజం. తెలివైనవాళ్ళు - తెలివితక్కువవాళ్ళను మోసగించే అవకాశం ఉంది. బలవంతులు బలహీనుల్ని పీడించే అవకాశమూ ఉంది. ఇలా జరక్కుండా బుద్ధిమంతులైనవాళ్ళు కొన్ని న్యాయాలనూ కొన్ని ధర్మాలనూ రూపొందించారు. కొన్ని కట్టుబాట్లను, ఆచారాలను ఏర్పాటు చేశారు. సంఘశ్రేయస్సును దృష్టిలో ఉంచుకొనే పెద్దలు ఇలాంటివి ఏర్పరచి సమాజక్షేమం కోసం వీటిని అందరూ ఆచరించాలన్నారు.

ప్రయోజనం సున్న :

కానీ ఎంతో సదుద్దేశంతో రూపొందిన ఈ ఆచారాలు కట్టుబాట్లూ రానురాను మూఢాచారాలకిందా, మూఢవిశ్వాసాలకిందా మారిపోసాగాయి. వీటిని తొలిసారిగా ఏర్పరచడంలోని మౌలిక ప్రయోజనంపోయి, శుష్కమైన ఆడంబరాలు మాత్రమే మిగిలిపోయాయి. అప్పుడు ధర్మం ధర్మంగానూ, న్యాయం న్యాయంగానూ ఉండదు. వ్యక్తులమధ్య ఉండాల్సిన ప్రేమాదరాలు తగ్గిపోయి వైరుధ్యాలు పెరిగిపోతాయి. కుల, మత, వర్గకలహాలు పెచ్చరిల్లి, సామాజికజీవనమే అల్లకల్లోలమయిపోతుంది!

సరిగ్గా అలాంటి సమయాల్లోనే మహాత్ముల అవసరం ఉంటుంది. వాళ్ళు తమ బోధనలతో, ప్రచారంతో, సామాజిక జీవితంలోని ఉద్రేకాలను, ఉద్వేగాలను తగ్గిస్తారు. శాంతిని నెల కొల్పుతారు.

అలాంటి మహాత్ములలో కబీరు ఒకరు.

కబీరును గురించి అనేక కథలు, గాథలు ప్రచారంలో ఉన్నాయి. ఆయనభక్తులలో వీటినన్నింటినీ నమ్మేవాళ్ళు నమ్మని వాళ్ళూ కూడా ఉన్నారు. కట్టుకథలని మనం తోసిపుచ్చినా, గట్టి కథలని విశ్వసించినా అవేమిటో మనం తెలుసుకోవాలి కదా!

## అన్నీ దేవుడి పేర్లే!

ఇప్పటికి ఐదున్నర శతాబ్దాల కిందటిమాట. 'నీరూ' అనే ఓ చేనేత పనివాడు కాశీనగరంలో ఉండేవాడు. అతని భార్య పేరు 'నీమా'. వాళ్ళకొక అనాథబాలకుడు దొరికాడు. ఆ పిల్లవాడు చాలా అందంగా ఉండడంతో అతన్ని పెంచుకొందామని వాళ్ళు నిశ్చ యించుకొన్నారు. అదీగాక-వారికి పిల్లల్లేరు.

ఇంటికొచ్చాక, ఆ కుర్రవాడికి మంచిపేరు సూచించమని ఓ మతప్రచారకుణ్ణి సంప్రదించారు. అతను 'ఖుర్-ఆన్' గ్రంథాన్ని పరిశీలించినపుడు అన్నీ దైవనామాలే కనిపించాయి. 'కబీర్' 'కుబ్రా' 'అక్బర్' మొదలైనవి.

**ఈ పిల్లవాణ్ణి చంపివేయండి!**

ఇతర మతప్రబోధకుల్ని అడిగిచూశారు. చిత్రం! వారికీ దైవనామాలే కనిపించాయి. ఆశ్చర్యపోయిన ఈ మత గురువు లందరూ ఈ అనాథబాలకుణ్ణి చంపవలసిందని ఆ దంపతులకు సలహా యిచ్చారు. కానీ ముద్దులు మూటగట్టే ఆ బాలుణ్ణి చంపటానికి నీరూ, నీమా మాత్రం ఇష్టపడలేదు.

మాంసపుముక్కకు మానవాకారం!

ఇలాంటిదే మరో కథ.

ఒకసారి ఓ బ్రాహ్మణుడు స్వామిరామానందులవారి దర్శనం చేసుకున్నాడు. వెంట అతని కూతురుకూడా ఉంది. ఆ కూతురు వితంతువు. ఈ సంగతి తెలియక రామానందులవారు ఆమెను తల్లి వి కమ్మని దీవించారు. ఆ తరువాత ఆమె చేతిమీద చిన్నకురుపు లేచిందనీ, అందులోంచి వెలికివచ్చిన ఓ చిన్నమాంసపు తునక మానవాకృతి ధరించి కొంతుల్ని పిరజిమ్మిందనీ, ఆ మానవ రూపమే కబీరని దీని సారాంశం.

సరైన ఆధారాలు లేవు:

శుకదేవుని అపరావతారమే కబీరని ఒక కథ చెబుతున్నది. సత్యయుగం నుంచి రకరకాల నామధేయాలతో కబీరు జన్మిస్తూనే ఉన్నాడని ఇంకొన్ని గాథలు తెలియచేస్తున్నాయి.

కబీరు జన్మస్థలంగానీ, జననసమయం కానీ స్పష్టంగా చెప్ప దగిన ఆధారాలు ఇంతవరకూ లభించలేదు. దొరికిన ఆధారాలు ఒకదానికొకటి సరిపోవడంలేదు.

బాల్యం:

ఇదే విధంగా కబీరు చిన్నతనాన్ని గురించిన కథలుకూడా కోకొల్లలుగా కనపడుతున్నాయి. బాల్యంలో అతను ఏ ఆహారం తీసుకోలేదు. నీరూ-నీమా పట్టుపట్టినప్పుడు పాలు తాగడానికి మాత్రమే ఇష్టపడ్డాడు.

నీరూ — నీమా మహమ్మదీయులు. వారి వృత్తి చేనేత, అమలులో ఉన్న ఆచారం ప్రకారం కబీరుకూడా మహమ్మదీయుడే! కానీ కబీరు రామనామం జపిస్తూ ఉండేవాడు. గోవిందసంకీర్తన-చేస్తూ ఉండేవాడు. హరినామం స్మరిస్తూ ఉండేవాడు.

ఇద్దరికీ కోపమే!

ఇది మహమ్మదీయులకు సరిపడేది కాదు. అదీగాక ఆనాటి మహమ్మదీయ ప్రభువుకు పరమతసహనం బొత్తిగా లేదు. ఈ అవకాశాన్ని మహమ్మదీయ మతప్రచారకులు బాగా ఉపయోగించు కున్నారు. కబీరుమీద విషప్రచారం చేశారు. హిందువుల దేవుళ్ళ పేర్లను జపిస్తున్నాడని మహమ్మదీయులకు కోపం. మహమ్మదీయుడయి ఉండికూడా హిందూవైష్ణవునిలాగా గంధం పూసుకొని

తులసిమాల ధరించి తమదైవనామాలను స్మరిస్తున్నాడని హిందువులకు కోపం.

అదే గురూపదేశం!

వైష్ణవసంప్రదాయంప్రకారం 'ముక్తి' కలగడానికి గురూపదేశం ఉండాలి. తన గురువు రామానందులవారని కబీరు చెప్పుకొన్నాడు. ఈ గురుత్వానికి సంబంధించికూడా కొన్నికథలు ప్రచారంలో ఉన్నాయి.

రామానందస్వామివారు గంగాస్నానానికి వెళ్ళి వచ్చే సమయాన్నీ, దోవనూ తెలుసుకొన్నాడు కబీరు. ఆయనవచ్చే దోవలో కాచుకొని కూర్చున్నాడు. రామానందులవారు రామనామాన్ని స్మరిస్తూ వెడుతున్నప్పుడు 'రామ' శబ్దం కబీరుచెవిన పడింది. అదే గురూపదేశంగా కబీరు భావించాడు. ఇదో కథ.

రామనామజపం:

కబీరు చీకటిమాటున రామానందులవారి శరీరాన్ని తాకాడు. తాకగానే 'ఓ రామా!' అన్నారు స్వామివారు. గురువు ఉపదేశించింది ఆ నామమేననుకొని కబీరు రామనామజపం చేయడం ప్రారంభించాడు. ఇది మరో కథ.

ఉదాహరణలతో....

ఒక సత్యాన్ని అవతలివాళ్ళకు బోధపడేలాగా చేయడం కోసం ఉదాహరణలు ఇవ్వడం మంచిదని కబీరు అభిప్రాయం. శుష్కమైన వాదనకన్నా ఒక ఉదాహరణను చూపినప్పుడు ఎదుటి వాళ్ళు సులభంగా గ్రహించవచ్చని కబీరునమ్మకం.

మూఢవిశ్వాసం తేలిగ్గా పోదు!

ఒక మూఢవిశ్వాసాన్ని తొలగించడం మాటలు కాదు. అందులోనూ, వందలాది సంవత్సరాలుగా ఆచరణలో ఉన్న ఒక ఆచారం ఎంత అర్థరహితమైనదో చెప్పడానికి పూనుకొన్నప్పుడు ఉత్తివాదనవల్ల లాభం ఉండదు. దాన్ని బొమ్మగీసి చూపించాలి! కబీరు ఆ పనే చేశాడు.

ఇదేమి చాదస్తం?

ఒకసారి రామానందులవారికి ఆవుపాలు కావలసివచ్చాయి. ఆ రోజున స్వామివారు తమ పితృదేవతలకు పూజాదికాలు నిర్వహిస్తున్నారు. పాలు తెచ్చే పనిని కబీరుకు అప్పగించారు స్వామి వారు. ఎంత సేపటికీ కబీరు రాలేదు.

'పిలుచుకు రండి!' అని శిష్యుల్ని పంపించారు స్వామివారు.

వారు తిరిగివచ్చి రామానందులవారితో ఇలా అన్నారు.

అయ్యా! కబీరు చచ్చిన ఆవుపొదుగుదగ్గర పాత్రను ఉంచాడు. నోటిదగ్గర మేతనుంచాడు' అని కబీరు అమాయికత్వాన్ని అవహాస్యం చేశారు.

'ఇదేమిటి ఈ చాదస్తం?' అన్నారు రామానందులవారు.

'స్వామీ! ఈ ఆవు చనిపోయి ఎంతోసేపు కాలేదు. కాబట్టి ఏకొంచెమైనా పాలు ఇవ్వకపోదని నా నమ్మకం. మీరు చనిపోయిన ఆవు మేత తినదనీ, పాలివ్వదనీ అన్నారు. ఇంతకు ముందే చనిపోయిన ఆవు కాసినిపాలు కూడా ఇవ్వకపోతే ఎప్పుడో చనిపోయిన మీ పితృదేవతలు ఈ పాలను ఎలా తాగుతారో సెలవివ్వండి!' అన్నాడు కబీరు వినయంగా.

ఆయన నీ పూర్తి బాధ్యత తీసుకుంటాడు!

'మతం' ఒక ఉత్తమ జీవనవిధానమనీ, ఒక ఉన్నతలక్ష్య ప్రేరితమనీ కబీరు విశ్వాసం. కానీ 'మతం' లోనికి అర్థం పర్థం లేని ఆచారాలు చాలా ప్రవేశించాయనీ, కపటులు, వంచకులు, 'మతం' పేరుతో భగవంతునిమీది విశ్వాసానికి విఘాతం కలిగిస్తున్నారనీ కబీరుకు తెలుసు.

"భగవంతునిమీద పరిపూర్ణమైన విశ్వాసం ఉంచు. నీ సమస్తాన్నీ భగవంతుని పరంచెయ్యి. ఆయన నీ పూర్తి బాధ్యతను వహిస్తాడు" అని కబీరు ఒక సందర్భంలో చెబుతాడు.

దీని వెనుక ఒక అద్భుతమైన గాథ ఉన్నది.

చిత్తం! స్వీకరించండి!

కబీరు చేనేతవృత్తిదారు కదా! ఒకసారి ఇలానే మగ్గాన్ని మూసి, నేసిన వస్త్రాన్ని తీసికొని అమ్మకంకోసం వీధిలో కొచ్చాడు కబీరు. అప్పుడొక పేదబ్రాహ్మణుడు ఎదురయి, తనకు వస్త్రదానం కావాలని అడిగాడు.

"చిత్తం స్వీకరించండి!

అంటూ కబీరు సగం వస్త్రాన్ని ఆ బ్రాహ్మణునికి దానం ఇవ్వబోయాడు!

"అలా కాదు. నాకు మొత్తం వస్త్రమే కావాలి" అన్నాడా బ్రాహ్మణుడు.

కబీరు అతన్ని తేరిపారచూశాడు. ఆ బ్రాహ్మణుని పేదరికం అతని గుండెను కరిగించింది. కన్నీటితో ఆ వస్త్రాన్ని బ్రాహ్మణునికి దానంగా ఇచ్చివేశాడు.

కానీ – కబీరుది కూడా నిరుపేదకుటుంబమే! తన సంపాదన మీదనే కుటుంబమంతా ఆధారపడి ఉంది. కబీరుకైనా ఈ నేతద్వారా తప్ప ఆదాయం వచ్చే ఇతర మార్గాలేమీ లేవు. ఈ

ఆర్థికవిషమసమస్యకు పరిష్కారం కబీరుకు స్ఫురించలేదు అందుకని సాయంకాలం ఇంటికి వెళ్ళలేదు.

మూడు రోజులు గడిచాయి. కబీరు ఆచూకీ దొరకనేలేదు. అతను ఎక్కడికి వెళ్ళిందీ ఎవరికీ తెలియదు.

ఆ సమయంలోనే మరో విచిత్రమైన సంఘటన జరిగింది.

మా ప్రభువు బహుమానాలు :

ఓ ఆజానుబాహుడు సీమా గడపముందు నిలబడి ఆమెను పిలిచాడు.

" ఎవరూ ? ' అంటూ సీమా ముందుకొచ్చింది.

ఎదురుగా నందిని పోలి ఉన్న ఒక ఎద్దు, దాని మూపున ఆహారపదార్థాలతో నిండిన సంచులూ ఉన్నాయి.

" ఏమిటివన్నీ ! " అన్నది సీమా ఆశ్చర్యంగా

"అమ్మా ! కాశీవిశ్వనాథుల దర్శనం కోసం ఒక ప్రభువు విచ్చేశారు. అక్కడే కబీరు కూడా ఉన్నారు. నిశ్చలచిత్తంతో విశ్వనాథులవారిని సేవిస్తున్న కబీరుభక్తిని చూసి ప్రభువులు మురిసి పోయారు. వీటిని ప్రసాదించారు అన్నాడా వ్యక్తి.

తిరిగి తీసుకువెళ్ళండి:

సీమా తల అడ్డంగా తిప్పింది.

" నాయనా ! నా బిడ్డ సంగతి నాకు తెలుసు. కబీరు మానవుల మంచి ఏ దానమూ స్వీకరించడు. తన ఆర్జితం కానిదేదీ నా బిడ్డడు తాకను కూడా తాకడు. ఈ సంభారాలను కబీరు స్వీకరించాడంటు- న్నారు. అది అబద్ధం. నేను నమ్మను. దయచేసి వీటిని తిరిగి తీసుకు వెళ్ళండి'' అన్నది సీమా.

నిజానిజాలు మీకే తెలుస్తాయి:

ఆ వ్యక్తి సీమావేపు పరిశీలనగా చూసి చిరునవ్వు నవ్వాడు.

"తల్లీ ! మీరన్నది అక్షరాలా సత్యమే ! ప్రభువులు దాన మివ్వడానికి సిద్ధపడినప్పుడు కబీరు అంగీకరించలేదు. ప్రభువులు ఎంతోసేపు ప్రతిమలాడారు. ఎప్పటికో గాని ఈ సరుకుల్ని ఇంటికి చేర్చడానికి కబీరు వొప్పుకోలేదు. కబీరుఅంగీకరించాకనే వీటిని ఇక్కడకు చేర్చాను. స్వీకరించండి. కబీరు మరికొన్ని క్షణాల్లో ఇక్కడికి రాబోతున్నాడు. అతను వచ్చాక నిజానిజాలు మీకే తెలు స్తాయి "

ఈ మాటలంటూ ఆ అజానుబాహుడు సరుకుల సంచుల్ని అక్కడ దించి, వృషభంతో సహా అదృశ్యమయిపోయాడు.

నామస్మరణతో శేషజీవితం :

అతనన్నట్లుగానే కబీరు వచ్చాడు. తల్లి జరిగిన సంగతంతా చెప్పింది. విని తన్మయుడయిపోయాడు కబీరు. క్షణక్షణం దారిద్ర్య బాధతో తెకతెకలాడిపోతున్న తన కుటుంబానికి ఆ కాశీవిశ్వనాథుడే ఈ రూపంలో సహాయపడ్డాడని కబీరు గ్రహించాడు. తను సంపూర్ణంగా భగవంతుని మీద ఆధారపడడం వల్లనే తనను భగవంతుడు ఆదుకొన్నాడని ఆయన విశ్వసించాడు.

అయినప్పుడు –

తనింకా ఈ భౌతిక ప్రయోజనాలకోసం ఆరాటపడడం అర్థరహితం। తన సమస్యలన్నింటినీ భగవదధీనం చేసి ఆయన నామస్మరణలో శేషజీవితాన్ని గడిపివేస్తాను.

నీవు తప్ప ఇంకేమీ లేదు :

ఈ నిశ్చయానికొచ్చాక కబీరు మగ్గాన్ని మడిచి మూల నుంచాడు. దీనితో ఆదాయమార్గం పూర్తిగా మూసుకుపోయింది. అయినా కొద్దిపాటి సంపద ఇంకా ఉండింది. దాన్ని అమ్మగా వచ్చిన డబ్బుతో భక్తులకు సంతర్పణ చేశాడు.

'భగవంతుడా! ఇప్పుడు 'నీవు' తప్ప నా కింకెవ్వరూ లేరు. 'నీవు' తప్ప నా కింకేమీ లేదు కూడా!" అన్నాడు కబీరు.

ఎందుకు కాశీని విడిచిపెట్టాలి?

ఈ త్యాగనిరతి ఇతరులకు ఆదర్శప్రాయం కావడానికి బదులుగా అసూయకు కారణభూతమయింది. కాశీలో ఉన్న బ్రాహ్మణు లందరూ కబీరుమీద కక్షకట్టారు. అతన్ని అవమానించి కాశీనుంచి బహిష్కరించాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. అతన్ని చుట్టు ముట్టి నగరం విడిచి పోవలసిందిగా కేకలువేశారు.

'ఎందుకు కాశీనగరాన్ని విడిచిపోవాలో చెప్పండి! అంతటి అపరాధం నేనేం చేశానో చెప్పకుండా నగరాన్ని విడిచిపెట్టమనడం ధర్మంకాదు" అన్నాడు కబీరు.

మాకూ సంతర్పణ చెయ్యి!

"నీ తప్పు నీకు తెలీదా? ఈ మధ్యనే నీవు సంతర్పణ చేశావు గదా! ఆ సంతర్పణలో బ్రాహ్మణులు తప్ప మిగిలిన వారందరూ ఉన్నారుగదా! ఇప్పుడు మాకు మాత్రమే సంతర్పణచేసి ఆ తప్పును సరిదిద్దుకో! లేదా కాశీని విడిచి వెళ్ళు అన్నారు బ్రాహ్మణులు ఏకగ్రీవంగా.

కబీరు నిశ్చలుడయ్యాడు.

ఇప్పుడు తను నిర్ధనుడు. వీరందరికీ కాదు సరిగదా ఈ సమూహంలోని ఏ ఒక్కరికీ తను పిడికెడు అన్నంకూడా పెట్టలేడు. సంతర్పణ సందర్భంలో వీరిని విస్మరించడం పొరబాటే! బ్రహ్మాండమైన సంతర్పణ!

" మంచిది! సంతర్పణకు అవసరమైన సరుకులు సమకూరుస్తాను "

కబీరు వెళ్ళిపోయాడు.

కొద్ది సేపటికల్లా కేశవబంజారా అక్కడికొచ్చాడు. అతన్ననుసరించి కూలీలు బారులుతీర్చి ఉన్నారు. వారి మూపుల మీద బియ్యం, చక్కెర, గోధుమపిండితో నిండిన సంచులున్నాయి.

"కబీరు పంపించాడు. వీటిని స్వీకరించండి!" అన్నాడు కేశవబంజారా.

బ్రాహ్మణులందరూ సంతోషంగా వాటితో సంతర్పణ చేసుకున్నారు.

ఇటువంటి అద్భుతగాథలెన్నో కబీరుచరిత్రలో మనకు కనపడతాయి.

కబీరు హిందువో, మహమ్మదీయుడో తేల్చుకోలేని పురోహితులూ, కాజీలు అతన్ని దూషించడంలోనూ, విమర్శించడంలోనూ ఏకమయ్యారు. ఈ విషయాన్ని తెలియచేసే సంఘటనల్ని ఓసారి గుర్తు చేసుకొందాం.

వ్యాధి నయమైంది :

'సికిందర్‌షా' అనే పాదుషా ఓ విచిత్రమైన వ్యాధితో చాలా కాలంగా బాధపడుతున్నాడు. ఎన్ని మందులకూ తగ్గలేదు. కాశీలో ఉన్న రామానందస్వామినీ కబీరునూ దర్శించమని ఎవరో సలహా యిచ్చారు. పాదుషా కాశీవచ్చాడు కానీ రామానందస్వామి దర్శనం కాలేదు. పాదుషా కబీరును చూశాడు. వ్యాధి నయమైంది. కబీరుకు సాష్టాంగ నమస్కారం చేశాడు పాదుషా.

ఎనలేని గౌరవం :

"రామానందులవారి దర్శనంకూడా చేసుకోండి" అని సలహా యిచ్చాడు కబీరు.

కబీరు కోరికను కాదనలేని రామానందస్వామి పాదుషాకు దర్శనమివ్వడంతో కబీరు శక్తి సామర్థ్యాలపట్ల ఎనలేని గౌరవం ఏర్పడింది పాదుషాకు. దీన్ని 'షేక్‌తకీ' సహించలేకపోయాడు. ఇతను పాదుషాకు గురువు.

**ఇదంతా నిజమేనా:**

ముస్లింకాజీ లందరూ షేక్‌తకీని ఆశ్రయించారు. బ్రాహ్మణ పురోహితులందరూ ఈ కాజీలను ఆశ్రయించారు. అందరూ కలిసి పాదుషాదర్శనం చేసుకొని కబీరు చేస్తున్న మతద్రోహచర్యలను పూసగుచ్చినట్లు చెప్పారు.

"అతను చేసిన నేరాలేమిటి?" అన్నాడు పాదుషా.

"మహాప్రభూ! కబీరు ద్రోహి, మోసగాడు. మహమ్మదీయ మతాన్ని కోసిపుచ్చాడు. హిందూమతాన్ని విమర్శించాడు. దేవతారాధనను తిరస్కరించాడు. ఆచారాలను పరిహసించాడు. బ్రాహ్మణ పురోహితులను గానీ, ముస్లింకాజీలనుగాని ఈ కబీరు లక్ష్యపెట్టడం లేదు. ఇంతకు మించిన నేరాలింకేమి కావాలి ప్రభూ?" అన్నారు వాళ్ళు.

పాదుషా కబీరును పిలిపించి "ఈ సంగతులన్నీ నిజమేనా?" అని అడిగాడు.

**మానవులకు భయపడను!**

"నేనీ హిందూ, మహమ్మదీయ పురోహితులకు విమర్శకు లకు భయపడను. భగవంతుని కటాక్షం ఉన్నంతవరకూ, ఆయన

నన్ను కాపాడుతున్నంతవరకూ, మానవులకు భయపడవలసిన అవసరం లేదు, అన్నాడు కబీరు శాంతస్వరంతో.

బంధించి గంగానదిలో పారేయండి :

తనను మతవిరోధిగా కాజీ చిత్రించినపుడు ఆ పరమ సాత్త్వికమూర్తి ఇలా అన్నాడు.

"మతాన్ని వక్రంగా చిత్రిస్తున్న నీ కన్న మతవిరోధులింకెవరున్నారిక్కడ? భగవంతుని ప్రీతికోసమంటూ మూగజీవాలను బలి ఇవ్వాల్సిందని ఏ మతగ్రంథం ఎప్పుడు ఎక్కడ ఆదేశించింది?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

పాదుషా ఆ సమాధానం విని భగ్గుమని మండిపోయాడు. కబీరును బంధించి గంగానదిలోకి విసిరివేయమని ఆజ్ఞాపించాడు. సేవకులు కబీరును సమీపించి కాలుచేతులుకట్టి గంగలో పడవేశారు.

ఎన్నో మహిమలు :

కబీరు భగవన్నామస్మరణ చేశాడు. సేవకులు కట్టిన కట్లు తెగిపోయాయి. గంగానది తరంగాలమీద కబీరు చిరునవ్వుతో కూచుని ఉన్నాడు.

ఈ రకమైన మహిమలు కబీరు ప్రదర్శించేవాడని తెలియ చేసే ఉదంతాలు చాలా చాలా కనబడుతున్నాయి.

పాదుషా చంపిన ఒక ఆవును కబీరు బతికించాడనీ, నిప్పుల మధ్య ఉండి కూడా మసిసైతం అంటకుండా వెలుపలికి వచ్చాడనీ, భయంకరమైన మదపుటేనుగు అతన్నిచూసి పిల్లిలాగా వెనుదిరిగి పోయిందనీ చెప్పే కథలు విరివిగా ప్రచారంలో ఉన్నాయి.

ఈ కోవకు చెందినవే మరో రెండు ఉదంతాలు.

**శవం 'కమాల్'గా బతికి వచ్చింది!**

పాదుషా కోరిక మేరకు ఢిల్లీ రావడానికి కబీరు అంగీక-రించాడు. అందరూ త్రివేణిసంగమంవద్ద విడిది చేశారు. కబీరు తన సహజ ధోరణిలో ప్రసంగిస్తున్న సమయంలో షేక్‌తకీ ఇలా అన్నాడు.

మహారాజా! కబీరు మహిమలను గురించి అనుమానాలున్న వాళ్ళు మనలో ఇంకెందరో ఉన్నారు. వాళ్ళ అనుమానాలను పోగొట్టే అవకాశం కబీరుగారికి ఇప్పుడు లభించింది. గంగానదీ

తరంగాల వాలుకు ఓ బాలుని శవం కొట్టుకుపోతూఉంది. ఆ శవాన్ని తన మహిమతో కబీరు ఇక్కడకు రప్పించవచ్చు!”

కబీరు నవ్వి ఆ శవాన్ని రమ్మని పిలిచాడు. శవం వచ్చాక 'ప్రాణంకూడా పోయమనండి ప్రభూ' అన్నాడు షేక్‌తకీ.

బాలుడు కదిలి వచ్చి కబీరు పాదాలముందు నిలబడ్డాడు.

ఆ పేరే అతనికి ఖాయమయింది.

**కమాలీ** లేచిరా!

ఢిల్లీ చేరాక జరిగిన మరో సంఘటన.

షేక్‌తకీ కూతురు చనిపోయి అప్పటికి చాలా రోజులయింది.

ఆమెను బతికించమని కోరాడు షేక్‌తకీ.

“షేక్‌తకీకూతురా! లేచి రా!”

అన్నాడు కబీరు.

సమాధి విడిలిపోయిందే తప్ప బిడ్డ లేచిరాలేదు.

'కబీరు కూతురా! కమాలీ! లేచిరా' అన్నాడు కబీరు. ఈసారి ఆ బిడ్డ లేచివచ్చింది.

గంగానదీజలాల్లోంచి వచ్చిన కమాల్, సమాధిమంచి లేచివచ్చిన కమాలీ చివరిదాక కబీరునే ఆశ్రయించుకొని ఉన్నారు.

కమాల్‌ను గురించి ప్రచారంలో ఉన్న మరోకథ ప్రకారం ఇతను కబీరు కొడుకు. అలాగే షేక్‌తకీ పాదుషాకు గురువుకాదనీ కబీరుకే గురువనీ మరోకథ ప్రచారంలో ఉన్నది.

ఆయా కథలకు, గాథలకూగల చారిత్రికాధారాలను గురించి మనం చర్చించడంలేదు.

కానీ-

వీటన్నింటిని గూర్చి చూసినప్పుడు మనకు కొన్ని సత్యాలు కనబడుతున్నాయి.

ఉపదేశాలు :

కబీరు తన స్వార్జితం కానిదాన్ని అనుభవించడాన్ని వ్యతిరేకించాడు.

విగ్రహారాధనను విమర్శించాడు.

ఏ పేరుతో పిలిచినా, 'పరమేశ్వరుడొక్కడే' నన్న పరమ విశ్వాసాన్ని ప్రచారం చేశాడు.

హిందూ మహమ్మదీయ మతాలలోని సారాంశం ఒక్కటే నవి గాఢంగా నమ్మాడు.

శుష్కమూ, అర్థరహితమూ అయిన ఆచారాలను పాటించడం మాని అంతశ్శుద్ధికోసం పాటుపడమని హితవు చెప్పాడు.

ఆయన రచించి గానంచేసి ప్రచారం చేసిన అసంఖ్యాక పదాలలో ఈ భావాలే గోచరిస్తాయి.

ఆయన నమ్మిన సత్యాలు:

భగవంతుడు సర్వవ్యాపి. ఆయన ఏదో ఒక ప్రదేశంలోనే ఉంటాడనడం అసత్యం అంటాడు కబీరు.

మనస్సును రాగద్వేషాలతో నింపుకొని అడవిలో ఉన్నా, అంతఃపురంలో ఉన్నా ఒక్కటే. శరీరమంతా బూడిద పూసుకొన్నా, జడలు పెంచినా, మనస్సు మాలిన్యరహితం కాకపోతే ఈ వేషాలు నిష్ఫలం నిరర్థకం మనస్సును జయించడమంటే ఈ మాయాలోకాన్ని జయించడమే అన్నాడు కబీరు.

భగవంతునికోసం క్షేత్రాలు, తీర్థాలు వెదకడంలో అర్థం లేదు. భగవంతుడు నీలో, నీ ఆత్మలో, నీ వంటి మానవులందరిలోనూ ఉన్నాడు. ఈ మానవులను ప్రేమిస్తే, వీరిని సేవిస్తే భగవంతుణ్ణి ప్రేమించినట్లే సేవించినట్లే.

కబీరు మత సామరస్యానికి మానవసౌభ్రాతృత్వానికి ప్రేమ సందేశం అచ్చమైన మచ్చు తునక.